482. స్త్రీ వశీకరణం - [redacted]

483. సమస్త పాషణములు - 50 గ్రా. సత్తును కరిగి కట్టు 100 గ్రా. సద్వీరం గ్రాసమివ్వగా సత్తు భస్మం అగును. దీనిని యోగామృతంతో నూరి 30 గ్రా మైలుతుత్తంనకు కవచమిచ్చి దీనిపై లాంతరు (పెట్రోమాక్స్ లైట్లు) ఒత్తులు చుట్టి దీనిపై మరల 30 గ్రా. పై భస్మం కవచం ఇచ్చి ఆరించి ప్రమిదలో పెట్టి శీలు చేసి చింత బెరడున మధ్యన పెట్టి పుటం. గురువు కట్టును.

దీనిని అరటిపండులో వేసి ఒక రాత్రి యుంచి పిండిన జయనీరు వచ్చును. ఈ జయనీరు రాగిగిన్నె చిన్నది (పంచ పాత్ర) నిప్పులపై పెట్టి ఏ పాషణమునకు చురికించిన కట్టును.

484. రసవెండి - వెండి చాందినిది 30 గ్రా., 500 గ్రా. పాదరసం, 2 మట్టి మూసలు తేసుకు వచ్చి లోపలి భాగంన పిప్పింటాకు పసరు బాగా పూసి ఆరించి ఇందులో రసం, వెండి యుంచి శీలు చేసి ఆరించి దోసెడు పిడకల పొడి చేసి పుటం. రసం కట్టి వెండి అగును.

485. నవాసార సున్నం - కాకి చిప్పలను మృదార పాలతో నూరి 10 పిడకల పుటం సున్నమగును.

నవాసారం 30 గ్రా., జెముడుపాలతో నూరి బిళ్ళ కట్టి ఆరించి ప్రమిదలో శీలు చేసి 10 పిడకల పుటం కరిగి కట్టును. పై సున్నం మధ్యన కట్టిన నవాసారంను పెట్టి చిన్న పుటం. నవాసారం సున్నం అగును.

486. సత్తు కట్టిన రససింధూరం - 1 తులం సత్తు, 1 తులం పాదరసం ద్వందించి కట్టిన ఇంగ్లీకం 3 తులాలు మొత్తం పండు జిల్లేడు ఆకు పసరుతో నూరి బిళ్ళ కట్టి ఆరించి ప్రమిదలో శీలు చేసి 5 పిడకలు పుటం. ఇలాగున 5 పుటాలు పెట్టిన సింధూరమగును.రెండు పూసలు వెండిపై, రాగిపై హాదేది

487. వెండి బూర యోగం - వెండి బూర 100 గ్రా. ఇంగ్లీకం 50 గ్రా నకు వెండి బూరను గుడ్డు తెల్లసొనతో నూరి ఇంగ్లీకానికి కవచమిచ్చి 7 మట్టి గుడ్డ శీలులు చేసి 3, 4 , 5, 6, 7, 8, 9, 10, 11, 12 మూడునుండి పిడకలు పెంచుతూ శీలు విప్పకుండా మొత్తం 10 పుటాలు పెట్టాలి. తదుపి ఇంగ్లీకంతో సహా మొత్తం మూసలో కరిగి దీనికి కట్టిన తాళకం

3 గ్రా. గ్రాసమిచ్చి రవ్వపోసుకొని మట్టి తీసుకొనగలరు. గీటు, కలరు రెండూ వుండును (ఎర్ర కలువ పూలతో కట్టిన తాళకం వాడేది)

488. ఉప్పు సున్నం - తినే ఉప్పు కట్టినది 700 గ్రా., ముద్దహారతికర్పూరం 200 గ్రా. వీటిని కలిపి నూరి ప్రమిదలో శీలు చేసి 20 పిడకల పుటం సున్నముగును.

489. తగర సున్నం - ఇనుప బాండిలో తగరం కరిగి తురక వేపాకు గ్రాసమిస్తూ వేపగ సున్నమగును.

490. ఉప్పు కట్టు - తామర ఆకు రసమున వుడికించి పుటం. నీటి పిప్పలిలో వుడికించి పుటం, పుల్లజెముడు రసంతో 2 రోజులు నూరి పుటం. ఉప్పు, వెలిగారం కలిపి నూరి మూసలో కరిగి తేనీరు అగున ఉప్పు, పటిక నూరి కరిగిన నీరు అగును.

491. తాసీల్దారు యోగం - కట్టిన తాళకం 1 తులం, సత్తు కట్టినది అర తులం, పాదరసం అర తులం వీటిని పచ్చ వావింటాకు పసరుతో నూరి బిళ్ళ ఆరించి కాకిచిప్పలల తినే సోడా పరిచి బిళ్ళలు పెట్టి శీలు చేసి 5 పిడకల పుటం, 10 గ్రా. రాగిపై 1 గ్రా. మందు వాడేది

492. ఉప్పు సున్నం - 1 తులం సవ్వీరం, 1 తులం కోపురస కర్పూరం వీటిని యోగామృతంతో మర్ధించి బిళ్ళ చేసి ఆరించి ప్రమిదలో శీలు చేసి 5 పిడకల పుటం. సున్నం. వెండి 10 గ్రా.లకు రెండు పూసల ఏత

493. సత్తు కట్టు సున్నం - పులిచింతతో కట్టిన ఉప్పును సత్తుకు గ్రాసమిచ్చిన సత్తు సున్నం అగును.

రసమైనం 1 తులం, నవాసారం 2 గ్రా., గంధకం 1 తులం వీటిని నూరి ప్రమిదలో శీలు చేసి పుటం (10 పిడకలు)

494. తగర సున్నం - తగర సున్నం 3 తులాలు, పాదరసం 3 తులాలు సమభాగాలలో నాభిపువ్వుల పసరు, తెల్లగన్నేరు పూల పసరు, తెల్లజిల్లేడు పూల పసరు వీటితో నూరి బిళ్ళ చేసి ఆరించి ప్రమిదలో పెట్టి శీలు చేసి 50 పిడకల పుటం. 10 గ్రా. వెండిపై రెండు గింజల సింధూరం వేస్తే సరిపోవును.

నోట్- తినే ఉప్పును కట్టి సున్నము చేసినది 60 గ్రా., ఉత్తరేణి ఆకు పసరుతో గాని లేక యోగామృతంతో గాని వీటితో నూరి నవాసారం ముక్క 30 గ్రా. కవచమిచ్చి పది

పిడకల పుటం. నవాసారం కట్టును. కట్టిన నవాసారం పై ఉప్పు సున్నం సమభాగాలు కలిపి నూరి దీని మధ్యన 2 తులముల సత్తును పెట్టి బ్లోయర్ పై మూసను పెట్టి ఊదగ జ్యోతి వచ్చును. వెంటనే క్రిందకు దించి చల్లారిన తర్వాత 10 గ్రా. రాగి కరిగి 1 గ్రా. సత్తు వేయవలయును.

నోట్- పటిక 3 తులములు, సవ్వీరం 3 తులములు, కట్టిన తాళకం 3 తులములు వీటిని కలబంద వేళ్ళ రసంతో నూరి బిళ్ళ కట్టి ఆరించి ప్రమిదలో శీలు చేసి 15 పిడకల పుటం

495. శంఖు సున్నం - ఇనుప మూకుడిలో అరకేజి ఉప్పును పోసి అందులో అర లీటరు మంచినీరును పోసి వండవలయును. ఈ విధంగా 5 పర్యాయాలు వండి గంగరావి ఆకు మెత్తగా దంచి ఇనుప మూకుడిలో పరిచి దానిపై పై ఉప్పును పెట్టి మరల గంగరావి ఆకు ముద్దను పెట్టి పొయ్యిపై 6 గంటలు (2 జాములు) వండిన అడుగున ఉప్పు మెటలుగా కరిగి వుండును. ఈ ఉప్పు అక్షయము. దీని మధ్యన 3 తులాల శంఖు పాషణ ముక్కలు పెట్టి ప్రమిదకు శీలు చేసి 25 పిడకల పుటం. మరల 35 పిడకల పుటం, మరలా 100 పిడకల పుటం శీలు విప్పకుండా. తదుపరి తెల్లజిల్లేడు పాలతో నూరి 25 పిడకల పుటం సున్నమగును.

496. నూజివీడు సంస్థానం నారి యోగం - తగరసున్నం, పాదరసం వీటిని నాభిపువ్వుల పసరుతో ఒక రోజు నూరి తదుపరి తెల్లగన్నేరు పువ్వులు లేక ఆకులు లేదా తెల్లజిల్లేడు పువ్వుల రసంతో మర్ధించి బిళ్ళ చేసి ఆరించి 5 పిడకల పుటం సున్నం అగును. రాగి పై ఏత (తగర సున్నం తురక వేపతో)

497. ఐరన్ యోగం - ఇసుక నుండి అయస్కాంతంతో ఇనుప రజను తీసి (100 గ్రా.) వేడిచేసి ఉప్పు నీటిలో ముంచ వలయును (7 సార్లు). దీనిని మెత్తగా నూరిన భస్మం అగును. దీనిని మూసలో వేసి, 20 గ్రా. తుత్తం, 20 గ్రా. సుర్మరాయి ఈ రెండు కలిపి నూరి పై దానికి గ్రాసమిస్తూ కరిగిన కరుగుడు ఆసిడ్ ప్రూఫ్ కాపర్ అగును.

498. వెండి యోగం - 60 గ్రా. ఉత్తరేణి ఉప్పును 60 గ్రా. గౌరి ముక్కకు కవచమిచ్చి 1 కే.జి ఉత్తరేణి బూడిదలో పెట్టి పంట. 1 తులం తగరంనకు 1 గింజ వేయగా వెండి అగును.

499. సత్తు కట్టు - పొంగించిన వెలిగారము సత్తుకు గ్రాసమివ్వగా సత్తు కట్టును.

500. ఇంగ్లీక సున్నం - కట్టిన ఇంగ్లీకం 30 గ్రా. తెల్లజిల్లేడుపాలతో నూరి బిళ్ళ చేసి ఆరించి వెలగకాయంత గంగరావి ఆకును మెత్తగా నూరి కవచమిచ్చి గుడ్డమట్టి శీలు చేసి 25 పిడకల పుటం. సున్నమగును. వెండి, రాగిపై ఏత

501. పచ్చ భాస్వరం మైనం - పచ్చ భాస్వరమునకు నైట్రిక్ , సల్ఫర్ , హైడ్రోక్లోరిక్ వీటిని సమానముగా కలిపిన 3 గంటలు యుంచిన నీరు వలె అగును. దీనిని పచ్చ భాస్వరముకు చురికించిన మైనము అగును.

502. శంఖు సున్నం - 150 గ్రా. గంధకం, 150 గ్రా. సూరేకారం వీటిని చింతపండు గుజ్జుతో నూరి మూకుడిలో పెట్టి నిప్పులపై వండగా గంధకం కాలిపోయి సూరేకారం యుండును. దీనిని చింతపండు గుజ్జుతో నూరి బిళ్ళ కట్టి ఆరించి పదిపిడకల పుటం సున్నమగును. ఇనుప మూకుడిలో 30 గ్రా. తగరం కరిగించి పై కారము సున్నం గ్రాసమిస్తూ రుద్దగా భస్మమగును. దీనిలో 30 గ్రా. సవ్వీరం చేర్చి నూరి 30 పిడకల పుటం. దీనిని జయనీరు తీసుకొని 50 గ్రా. శంఖం ముక్కకు పెంకులో పెట్టి చురక. శంఖం సున్నమగును. రసమునకు చేర్చి నూరి వేడిచేసిన రసం కట్టును. రాగిపై వేసిన 27 వ వన్నె వచ్చును.

503. తామ్రం భస్మం - 10 గ్రా. రాగి రేకు ముక్కలను 30 గ్రా. పటిక నూరి దీని మధ్యన రాగిని పెట్టి శీలు చేసి 30 పిడకల పుటం. ఈ విధంగా 3 పుటాలు. తామ్రం భస్మం అగును. ఇసుక నుండి తీసిన ఐరన్ రజను 30 గ్రా., మైలుతుత్తం 20 గ్రా., ఈ మూడు కలిపినది 40 గ్రా., 20 గ్రా. కరిగి గ్రాసమిచ్చి చల్లారిన తర్వాత భూమిలో 2 రోజులు పాతిపెట్టి యుంచవలయును. లోపల పూజియుండును. దీనికి సగం బీజం చేర్చి కరిగి ఒక రోజు యుంచి కరిగి మట్టి తీసుకోవలెను. (కలరు ముక్తముగా వుండును) అనుభవము.

504. కిడ్నీలు బాగుచేయు మందు - 1 తులం శుద్ధ పాదరసం, 1 తులం శుద్ధి గంధకం, 1 తులం మైలు తుత్త భస్మం - 1 తులం పిప్పళ్ళు వీటిని తెల్లగలిజేరు పసరుతో 9 గంటలు మర్దించి కందగింజలవలె మాత్రలు చేసి బిళ్ళలుగా నొక్కి ఎండించి సీసాలో పెట్టి శీలు చేసి ఇసుక మధ్యన పెట్టి 6 గంటలు వంట చేసిన సింధూరం. దీనిని కంది బద్దంత మందు 21 రోజులు వాడనలయును. (కారం, ఉప్పు, పులుపు తక్కువ వాడవలయును)

505. శుద్ధులు -

అ) పాదరసంనకు - 100 గ్రా. రసంనకు 5 గ్రా. సవ్వీరం చేర్చి నూరి కడిగి పసుపుతో నూరిన శుద్ధి అగును.

ఆ) తుత్తమును మజ్జిగలో 3 గంటలు గోమూత్రంలో 3 గంటలు తేనెలో 3 గంటలు శుద్ధి.
దీనిని తెల్లగలిజేరు పసరుతో నూరి పుటం
ఇ) గంధకం నిమ్మపులుసులో 3 రోజులు శుద్ధి

506. కిడ్నీ బాగుచేయుటకు - కట్టిన సూరేకారం 2 తులములు, నవాసారం 2 తులములు, తినే ఉప్పు 2 తులములు, వీటిని నూరి వుంచుకుని 60 గ్రా. ఇంగ్లీకం ముక్కకు 20 గ్రా. గంధకం, 20 గ్రా. తాళకం, 20 గ్రా. సప్వీరం వీటిని నిమ్మపులుసుతో నూరి ఇంగ్లీకంనకు కవచం ఇచ్చి పై ఉప్పు పొడి క్రిందపైన పరిచి శీలు చేసి 70 పిడకల పుటం. ఇది వెండిని ప్రూఫ్ చేయును. ఈ ఇంగ్లీకం 250 గ్రా. జాపత్రిని వేపి నూరి పిడతలో 4 పిడకల పుటం. దీనిని తేనె, నెయ్యితో అనుపానం.కిడ్నీలు బాగుచేయును.

507. వైద్యం - తుత్తం నుండి తీసిన రాగి అరతులం కాటుకవలె నూరిన దానిలో 1 తులం నల్లమందు చేర్చి నూరి వుండ చేసి ములగచెట్టుకు రంధ్రంచేసి అందులో పై వుండను పెట్టి అదే పిప్పితో రంధ్రం పూడ్చి, మట్టితో పూడ్చి 10 రోజులు యుంచి తీసి మెత్తగా నూరి బిళ్ళ చేసి ఆరించి 25 పిడకల పుటం. తెల్లగా భస్మం అగును. సీసాలో జాగ్రత్త చేసి వడ్లగింజతో సాయంత్రం వేసుకొనవలయును. (ఆవు నెయ్యి అనుపానము) అరగంట తర్వాత భోజనం చేసి అరగంట తర్వాత ఆవుపాలు తాగవలయను.

చర్మరోగాలకు మంజిస్త మణిశిల మానుపసుపు, పసుపు చెక్క, తేనె వీటిని కలయ నూరి శరీరమునకు పట్టించి సకల చర్మవ్యాధులు పోవును.

నరాల వాతమునకు - 1 తులం వీరమును కొబ్బరినీరులో 1 రోజు శుద్ధి. చిత్రమూలం సమూలం, నారింజకాయంత ముద్ద మధ్యన వీరం పెట్టి ఇది మునిగేలాగున మూర్కొండ పసరు పోసి వంట. పసరు ఇంకిన తర్వాత పెద్ద దూలదొండు తడుపరి గంటగలగర పసరుతో మర్ధించి కంది గింజ ప్రమాణం మాత్రలో ఉదయం సాయంత్రం తేనెతో పొర్లించి మాత్రలు వేసుకొనవలయును. నాలుగు రోజులు మాత్రమే మందు వాడవలయును.

హై బి.పికి మందు - నల్ల ఈశ్వరి, జటామాంశి, కర్పూర శిలజిత్తు, పటిక బెల్లం ఇవి సమభాగాలు చూర్ణించి సప్పిడి చేయాలి.

హై బి.పికి, లో బి.పికి రెండింటికి - నల్లజీలకర్ర 100 గ్రా., వెల్లుల్లి పలుకులు 100 గ్రా. వీటిని నూరి శనగ గింజల వలె మాత్రలో

ఆకలి కలుగుటకు - స్వర్ణ గైరికం, పొంగించిన వెలిగారం ఈ రెండు సమం బెడెత్తు చొప్పున ఇచ్చేది.

గ్రాస్టిక్ ట్రబుల్స్ కు - ఇంగువ, గచ్చపప్పు, సైంధవ లవణం, శొంఠి, మిరియాలు, పిప్పళ్లు, వెల్లుల్లి నీటితో నూరి కుంకుడు గింజంత మాత్రమే కట్టి ఉదయం, సాయంత్రం 20 రోజులు వాడవలెను. అల్సరు, గ్యాస్టిక్ ట్రబులు, బహిష్టు నొప్పి

కంఠస్వరం బాగుపడుటకు - జాజికాయ చూర్ణం తేనెలో 10 రోజులు వాడిన బాగుపడును. అతి మూత్రము తగ్గును.

అతిమూత్రం శుద్ధకట్టుకు - నువ్వుల పప్పు 1 కే.జి , మంచిబెల్లం 1 కే.జి, ఉకు భస్మం 1 తులం బాగా దంచి ఉదయం సాయంత్రం 2 తులాలు తినవలెను 21 రోజులు

ఆకలి పెరుగుటకు - శుద్ధిరసం గంధకం శుద్ధి నాభి లవంగాలు మిరియాలు, జాజికాయ వీటిని చింతపండు పులుసులో 2 రోజులు మర్ధించి మినపగింజంత ప్రమాణము మాత్రలు చేసి అజీర్తి తగ్గును ఆకలి పెరుగును.

వాజికరమునకు - తెల్లగలిజేరు వేరు 1 అంగుళము ముక్క, చిట్టి కరక్కాయ పెచ్చు బుగ్గన పెట్టుకొని పీటి ఊటను మ్రింగవలెను.
జాజికాయను 5 ముక్కలు చేసి 1 ముక్కను బుగ్గను పెట్టుకొనవలెను.

వీర్య స్థంభన - లవంగాలు 1 తులం పాదరసం 1 తులం సంపెంగ వేరు పట్ట 4 తులాలు వీటిని 74 గంటలు విడవకుండ నూరి సూది మొన అంత తమలపాకులో సేవించేది అమోఘ్యమైన వీర్యస్థంభన

నడుంనొప్పిలకు - ఆనుదపు పప్పు పాలతో మెత్తగా నూరి పాలలో వేసి సేవించేది. అసాధ్యమైన నడుంనొప్పులు తగ్గును.

బోదకాలకు - కరక్కాయ పెచ్చు, గోమూత్రములో 7 రోజులు నానబెట్టి దంచి పొడరు చేసి సమానం బిళ్ళ చేసి పూటకు ఉసిరికాయంత ఇవ్వవలెను. పసుపు, ముసంబరం, బాలింత బోలు, ఆవాలు, ఇంగువ, కారు ఇంగువ వీటిని దుష్టపు ఆకు పసరుతో నూరి కాలుదు ఆవిరి పట్టిన తర్వాత పూయవలెను.

సర్వప్రదార రోగాలకు - 50 గ్రా. ఇంగ్లీకం 1 కప్పులో పెట్టి ముక్క మునిగేలాగ తేనె పోసి 2 రోజులు నానబెట్టి అదే తేనెతో ఇంగ్లీకంను నూరి బిళ్ళ కట్టి 100 గ్రా. గులాబి

పువ్వులను నూరి పై ఇంగ్లీకంనకు కవచమిచ్చి ప్రమిదలో వుంచి శీలు చేసి 50 పిడకల పుటం మైనమగును. కందగింజంత వెన్న తేనె అనుపానం రెండు పూటలు. సమస్త కుసుములు పొందు శుక్లనష్టస్త పురుషత్వం పెరుగును.

జ్వరాలకు అజీర్ణ విరోచనాలు - 1 తులం ఇంగ్లీకం, పావు తులం రస సింధూరం వీటిని తెల్ల వంకాయలో పెట్టి గుడ్డ శీలు చేసి 10 పిడకల పుటం. వంకాయపై తొక్క తీసి లోపలి గుజ్జుతో నూరి ఆవగింజంత మాత్రలో. పత్యం లేదు.

మకరధ్వజ మాత్రలు - కట్టిన ఇంగ్లీకం 1 తులం, లవంగాలు 1 తులం, పచ్చకర్పూరం 1 తులం, జాజికాయ 1 తులం, జాపత్రి 1 తులం, యాలుకలు 1 తులం, చిన్నం కస్తూరి వీటిని తమలపాకు రసంతో నూరి మాత్రలు చేసి వాడేది రెండుపూటలు

వాంతులు తగ్గుటకు - వేప చిగురు 1 తులం, ఇంగ్లీకం 1 తులం నీరులో నూరి పప్పిగా చేసి నీటితో అరగదీసి నాకించిన వాంతులు తగ్గును.

మేఘరంజని ఉబ్బసం దగ్గులు టి.బి. మొదలగు జబ్బులకు - 5 తులాల పత్ర తాళకంను ఆవుపాలలో నానబెట్టి అదే పాలతో నూరి బిళ్ళ కట్టి ఆరబెట్టి 100 గ్రా. మారేడు ఆకును నూరి కవచమిచ్చి ప్రమిదలో పెట్టి శీలు చేసి 25 పిడకల పుటం. తెల్లగా భస్మం అగును. తమలపాకు రసంన వాడవలయును. తగ్గినచో మందు వాడనవసరం లేదు. 7 రోజులు మాత్రమే వాడవలయును. పత్యం లేదు.

మెడ వాత నొప్పులకు (సవ్వీర మైనం) - 5 తులాలు సవ్వీర ముక్కను సున్నపు తేట నీటిలో 2 రోజులు నానబెట్టి అదే నీరుతో నూరి బిళ్ళ కట్టి ఆరించి 100 గ్రా. మల్లెపువ్వులు నూరి పై బిళ్ళ కు కవచమిచ్చి ప్రమిదలో వుంచి 50 పిడకల పుటం మైనమగును. తేనె, వెన్న అనుపానం. పత్యం లేదు

ముగరు మందు (గ్యారంటీ మందు - కృష్ణ అభ్రకం 50 గ్రా. ఒకే ముక్కకు తాటిబెల్లం 100 గ్రా. నూరి కవచమిచ్చి 300 పిడకలతో పుటం. తెల్లారిన తర్వాత బూడిద వర్ణంలో వుండును. దీన్ని త్రిధారి పాలతో 4 గంటలు నూరి చిన్న సైజు బిళ్ళలు చేసి ఆరబెట్టి బ్లోయర్ పై ఊదవలెను. పొగ అంతా పోయే వరకు ఊదవలెను. దీనిని ప్రమిదలో పెట్టి 300 పిడకల పుటం. ఈ విధంగా 7 పుటాలు. సింధూరమగును.

గంధకం కట్టు - తెల్లమధ్యచెక్క బూడిదలో 100 గ్రా. గంధకం పెట్టి 4 గంటలు వంట గంధకం కట్టి బిళ్ళ వుండును. దీనిని నూరుకొని వుంచుకొనవలెను.

మంచి నల్లమందు 1 భాగం, పై గంధక భస్మం 1భాగం, పై అభ్రక భస్మం 1 భాగం వీటిని తేనెతో 3 గంటలు నూరి మినప గింజెత్తు మాత్రలు చేసి వేడినీరుతో మాత్ర వాడవలయును. 2 పూటలు, 40 రోజులు వాడవలయును. 40 రోజుల తర్వాత అన్నీ తినవచ్చును.

నడుంనొప్పులకు - ఉమ్మెత్త కాయలు ముచ్చుకలు తీసి కాయను తొలిచి రత్నపురి గుగ్గిలం కాయలో యుంచి దూకుడు పుటం. చల్లారిన తర్వాత గుగ్గిలం తీసుకొని నూరుకొని వుంచుకొనేది. పావుతులం మందును అరటిపండులో పెట్టి ఇవ్వవలయును. రెండుపూటలు. ఉప్పు లేకుండ మజ్జిగ, పెరుగన్నం మాత్రమే తినవలయును. 3 లేక 6 రోజులు మాత్రమే

సమస్త రోగాలకు - మారెడు వెదురు గొట్టంలో ఒక వైపు కన్నం వుండాలి. నీటి పిప్పిలి ఆకు సగం వరకు పూడ్చి (కానివి) పెట్టి మరల ఆకుతో గొట్టం పూడ్చి మట్టి బిరడా వేసి గజపుటం. తెల్లగా భస్మం అగును. వీసమెత్తు వెన్నలో సకల రోగాలకు.

ఎర్ర కుసుమకు - ఒక గ్రాము పటిక పొడి, అడ్డసరకు కసాయంతో మూడు పూటలు ఇవ్వవలయును.

కస్తూరి తుమ్మ చెక్కపొడి 60 గ్రా. మధ్యన 5 గ్రా. శుద్ధి శంఖం పెట్టి 3, 4, 5 పిడకల పుటం. ఈ మందు ఇద్దరకు . మందు తేనెతో అనుపానం

మధురుకు మందు - 5 తులముల వలంద ఇంగ్లీకం ఏకముక్క గ్లాసులో వేసి అది మునిగేవరకు చనుబాలు లేక ఆవుపాలు పోసి 2 రోజులు వుంచి ఆపాలతోనే నూరి బిళ్ళ చేసి 10 తులముల హంసపాది ఆకు మెత్తగా నూరి పై బిళ్ళకు కవచమిచ్చి ప్రమిదలో పెట్టి శీలు 50 పిడకల పుటం. ఎత్తు తగ్గకుండా తెల్లగా భస్మం అగును. పై మూలిక బూడిదను పూది వేసి తేనెతో 20 రోజులు వాడేది. రెండుపూటలు వడ్ల గింజంత. అతి మూత్రం, శుక్లనష్టములు, కుసుములు, పాండు వ్యాధులు తగ్గును. పత్యము లేదు

తెల్లవెంట్రుకలు నల్లగా అగుటకు - గంధకం 15 గ్రా., లోహ భస్మం 15 గ్రా. వీటిని తేనెతో నూరి కందిగింజంత మాత్రలు చేసి నెయ్యి లేక త్రిపుల కషాయంతో రెండు పూటలు వాడవలెను. వెంట్రుకలు నల్లగా అయ్యేంత వరకు.

వీర్యస్తంభనకు - రస భస్మం 10 గ్రా., లవంగాలు 8 గ్రా., నల్లమందు ౬ గ్రా., దాచిన చెక్క 4 గ్రా., తవాచ్చరి 2 గ్రా. వీటిని తమలపాకు పసరుతో నూరి శనగ గింజంత మాత్రలు చేసి వాడవలయును. మాత్ర వేసుకొని పాలు తాగవలయును.

హెచ్.ఐ.వి పేషెంటులు వాంతులు, విరోచనాలు తగ్గుటకు - నల్లజీడి గింజల తైలం 1 తులం, ఇంగ్లీకం నుండి తీసిన పాదరసం 1 తులం, శొంఠి చూర్ణం 1 తులం, వాయు విడంగాల చూర్ణం 1 తులం వీటిని మెత్తగా నూరి కంది గింజంత ప్రమాణం మాత్రలు. మంచినీరుతో వాడవలయును.

హెచ్.ఐ.వి జ్వరాలకు - ఒక తులం గాలివాస చెట్టు వేరుల చూర్ణం, 100 గ్రా. చెంగల్వ కోష్టు, నల్ల ఉమ్మెత్త చిగుర్లు 5 గ్రా., వాము చూర్ణం 1 తులం, అమర శిల గంధకం 15 గ్రా., వీటిని నిమ్మపులుసుతో నూరి శనగగింజంత మాత్రలు చేసి ఆరించి మంచినీరుతో వాడవలెను.

హెచ్.ఐ.వి విరోచనాలు తగ్గుటకు - జాజికాయ 10 గ్రా., నల్లమందు 10 గ్రా., తుంగ ముస్తలు 10 గ్రా., ముద్దహారతి కర్పూరం 10 గ్రా., కొడిసె విత్తులు 10 గ్రా. వీటిని మంచినీరుతో నూరి శనగ గింజంత మాత్రలు. మంచినీరుతో వాడవలయును.

హెచ్.ఐ.వికి మందు (వీర సున్నం) - ముల్లంగి దుంపలు సమూలం కాల్చిన బూడిద 1 కే.జి నందు 3 లీటర్ల నీరుపోసి 3 రోజులు వూరనిచ్చి ఈ నీరుతో 50 గ్రా. సవ్వీరం నూరవలయును. నీరు మొత్తం నీరంతా నూరవలయును. బిళ్ళ కట్టి ఆరించి 30 పిడకల పుటం. సున్నమగును. ఈ సున్నం 1 గ్రా. మందు 30 పొట్లాలు కట్టి తేనె, వెన్న, నెయ్యి వీటితో వాడవలయును.

రజిత మైనము (నానగారి యోగం) - వెండి బూర 50 గ్రా., పాదరసం శుద్ధిచేసినది ఈ రెండింటిని నిమ్మపులుసుతో మైనం అయ్యేంత వరకు నూరి సూర్యపుటం.

జాజి 20 గ్రా., జాపత్రి 20 గ్రా., యాలుకలు పప్పు 20 గ్రా., లవంగాలు 20 గ్రా., పచ్చ కర్పూరం 20 గ్రా. వీటిని చేర్చి కొబ్బరి నూనెతో నూరి శనగ గింజల వలె మాత్రలు చేసి మంచినీరుతో మాత్ర వేసుకొని పాలు త్రాగి తాంబూలం వేసుకొనవలెను.

అంజనము - హంసపాదు ఆకు పసరు తీసి ఎండించి తెల్లటి గుడ్డలో చుట్టి వత్తివేసి నువ్వులనూనె లేక కొబ్బరి నూనెలో తడిపి దీపం వేసి మసిపట్టి అంజనం వేసిన 10 సంవత్సరాల మగ పిల్లవానికి చూపిన సర్వం కనబడును.

హెచ్.ఐ.వి కి మందు - శంఖు పాషణం 3 గ్రా., మిరియాలు 12 గ్రా. ఇవి కల్వంవ వేసి 20 తులాలు త్రిధార పాలు పోసి నూరి ఎండించి బిళ్ళ కట్టి ప్రమిదలో యుంచి శీలు చేసి 10 శేర్ల పుటం భస్మం అగును. ఈ మందు చిన్న చీమ తలకాయంత వెండి ద్రాక్ష పండులో పెట్టి రోజుకు ఒక మోతాదు 7 రోజులు వాడవలయును. తీపి తినకూడదు. నెయ్యి, రొట్టె తినవలయును. పాలు త్రాగవలయును.

పాదరసం 1 తులం, సల్ఫర్ ద్రావకం 5 తులములు, బ్లోరో సిల్ బల్బులో చిన్నది దాంట్లో పోసి నిప్పులపై పెట్టి పొగ పోయే వరకు పెట్టి వండిన తెల్లగా భస్మం అగును. దీనిని 21 సార్లు మంచినీటితో కడిగి జాగ్రత్త చేసుకొని 1 లేక 2 బియ్యపు గింజలంత ప్రమాణం హల్వాలో కలిపి వాడవలయును. ఈ భస్మం పసుపు పచ్చగా వుండును. ఈ భస్మంను 10 గ్రా. నల్ల సుర్మారాయి 5 గ్రా. కలిపి నూరిన ఆకు పచ్చగా వుండును. కంటికి కాటుక పెట్ట వలయును.(వారానికి ఒక్కసారి కాటుక పెట్టవలయును)

రస కర్పూరం 1 తులం, వెండి రజను 1 తులం, నవాసారం 1 తులం ఈ మూడు నూరుకొని పతంగం చేయవలయును. 3 సార్లు దీనినే పతంగ తీసి 2 లేక 4 బియ్యపు గింజలెత్తు వెన్నతో వాడవలయును. 7 రోజులు వాడిన చాలు. బలమైన ఆహారం తినవలయును.

కీళ్ళనొప్పులకు, మోకాళ్ళ నొప్పులకు - 2 తులముల నల్లమందు, 1 తులం ముద్దహారతి కర్పూరం కలిపి నూరి శనగ గింజంత మాత్రలు చేసి రాత్రి బోజనం తర్వాత వాడవలెను.

మూల వ్యాధులకు, పిలకలకు - రసాంజనం, వెలిగారం వీటిని మంచినీరుతో నూరి బటాని గింజలవలె మాత్రలు చేసి నీటితో అరగదీసి పిలకలకు పూయవలెను. బహుశీఘ్రముగా తగ్గును.

సూరేకారం, ముల్లంగి రసంతో నూరి పిలకలకు రాయవలెను.
నీరుల్లి రసం, పసుపు ఆముదం నీటిని సమానంగా నూరి పై పూత.
విషముష్టి గింజలు పాతాళ యంత్రము ఆయిలులో తీసి పిలకలకు దూదితో పూయవలెను. జీవితంలో మరల రాదు.

కంటి జబ్బులకు (కన్నులు ఎరుపు తగ్గుటకు) - పన్నీరు 3 తులములు, నిమ్మరసం నగకట్టినది 3 తులములు ఈ రెండింటిని కలిపి వడకట్టి సీసాలో పోసి వుంచుకొనవలయును. కంటిలో 2 చుక్కలు రాత్రిపూట పోయవలయును

రేచీకటికి మందు - నవాసారం 10 గ్రా., పొంగించిన పటిక 10 గ్రా., నీరుల్లి రసంతో నూరి సీసాలో భద్రపరుచుకొనవలయును. పెసరు బద్దంత కంటికి కాటుక పెట్టవలయును. వారం రోజుల్లో రేచీకటి తగ్గును.

రోమములు రాలుటకు - ఆవ నూనెలో సుర్మా రాయిని నూరిన పొడిని కలిపి 7 రోజులు ఎండలో ఎండించిన తర్వాత ఈ నూనెను ఎక్కడ రాస్తే అక్కడ వెంట్రుకలు రాలిపోవును.

తాళకం, మణిశిల, మజింష్ఠ, వస ఈ నాలుగు నువ్వులనూనెతో మర్ధించి రాసిన అక్కడ వెంట్రుకలు రాలును.

పురుషత్వం పెరుగుటకు - పటిక 80 గ్రా., గంధకం 60 గ్రా. వీటిని నీరుల్లిపాయి రసంతో 3 రోజులు నూరిన ముద్ద మధ్యన 1 తులం తాళకం ముక్క పెట్టి పిడతలో పెట్టి శీలు చేసి 30 తులాల పిడకల పుటం. చల్లారిన తర్వాత తాళకంతో సహా మొత్తం మందును తీసుకొని పావుతులం పటిక బెల్లంతో కలిపి రోజుకు ఒక్కసారి మందు వాడవలయును. మగతలం ఎక్కువవగును.

వీర్యవృద్ధికి - రెండు చిన్నాలు షంకుపాషణం కల్వంలో నూరి 7 సీమబాదంపిక్కలు పై తొక్కను తీసి నూరవలయును. రెండవ రోజు మరల 7 పిక్కలు వేసి నూరవలయును. ఈ విధంగా 7 రోజులు ఏడేసి పిక్కలు వేసి నూరవలయును. మొత్తం 49 పిక్కలు వేసి నూరవలయును. శనగ గింజంత మాత్రలు వేసి రోజొక్కటి మాత్ర వాడవలయును.

1 తులం సవ్వీరం, 1 తులం ఇంగ్లీకం, 1 తులం పొటాషియం పర్మాంగనేట్, 100 గ్రా. అష్టశుద్ధులు చేసిన గ్రంధకం, 30 గ్రా. స్వర్ణ మాక్షిక సింధూరం వీటిని తేనెతో మర్ధించి పెసరు గింజంత ప్రమాణం మాత్రలు చేసి నీడన ఆరించి ఉదయం టిఫిన్ తరువాత, మధ్యాహ్నం బోజనం తరువాత, సాయంత్రం భోజనం తరువాత మంచినీరుతో వాడవలయును.

షుగరుకు మందు (నాన్నగారిది) - బలురక్కసి (పిచ్చికుసుమ) వేర్లు చూర్ణం, పచ్చి పసుపు మంచినీరు అనుపానం చెంబాడు మందు వాడవలయును. పూటకు రెండు పూటలు

సోరియాసిస్ కి మందు (నాన్నగారిది) - ఇంగ్లీకం 10 గ్రా., సవ్వీరం 10 గ్రా. రససింధూరం 10 గ్రా., తాళకం 10 గ్రా., పాదరసం 10 గ్రా., రసకర్పూరం 10 గ్రా. వీటిని ఆముదంతో నూరి సీసాలో పెట్టి మూతమూయకుండ సీసాకు గుడ్డశీలు చే

ఇసుకలో పెట్టి 6 గంటలు వంట. సింధూరమగును. అరటిపండు మాటుపెట్టి లేక వెన్న మాటుపెట్టి వాడవలెను.

పూర్ణచంద్రోదయం (నాన్నగారిది) - 3 గ్రా. బంగారపు రజను, శుద్ధిపాదరసం 20 గ్రా., శుద్ధి గంధకం 20 గ్రా. ముందుగా రజను పాదరసం కలిపి నూరి తదుపరి గంధకం చేర్చి అడవి చేమంతి (గాయపాకు) పసరుతో 3 రోజులు మర్దించి కంది గింజలవలె మాత్రలు చేసి ఆరించి సీసాలో పెట్టి 3 శీలులు చేసి (మూత మూయ్యవలెను)ఇసుక మధ్యన పెట్టి 3 గంటలు వంట చేసి చల్లారిన తర్వాత తియ్యగా సింధూరం అగును.

యాలకుల గింజలు 6 గ్రా., లవంగాలు 6 గ్రా., దాచిన చెక్క 6 గ్రా. జాజి 6 గ్రా., పచ్చకర్పూరం 6 గ్రా. వీటిని తమలపాకు పసరుతో నూరి కంది గింజంత మాత్రలు వాడవలయును.

సర్వవాతములకు - శుద్ధిపాదరసం 40 గ్రా., శుద్ధిగంధకం 10 గ్రా., నాభిశుద్ధి నాభి 160 గ్రా. వీటిని కల్వంనందు మెత్తగా నూరి చిత్రమూలం పసరుతో నూరి మినపగింజంత మాత్రచేసి ఆరించి వుంచుకొనవలయును. మాత్ర నెయ్యిలో పొర్లించి మాత్ర వేసుకొని మిరియాల కషాయం తాగవలయును.

తల నల్లగా అగుటకు - ఊడుగ గింజల పప్పు 100 గ్రా., కరక్కాయ పెచ్చులు 100 గ్రా., అన్నబేది 30 గ్రా., వీటిని మెత్తగా నూరి ఒక కేజి కొబ్బరినూనెలో కలిపి కాచి చల్లార్చి తలకు రాయవలయును.

హెచ్.ఐ.వి కి మందు గ్యారంటీ మందు (కేడి పేట నాన్నగారియోగం) - గౌరిపాషణం 12 గ్రా., శంఖుపాషణం 12 గ్రా., బంగారపు రజను 4 గ్రా. వీటిని ముందుగా రుద్రబెండ ఆకుపసరుతో 3 గంటలు మర్దించి బిళ్ళ కట్టి ఆరించి ప్రమిదలో శీలు చేసి 20 పిడకల పుటం. పై విధంగా 3 పుటాలు. 4వ పుటంవెలుతురు ఆకు పసరుతో నూరి బిళ్ళ కట్టి పిప్పి క్రిందపైన పెట్టి 20 పిడకల పుటం. తదుపరి ముందు విధంగా 3 పుటాలు. మొత్తం రుద్రబెండతో 6 సార్లు, వెలుతురు చెట్టు ఆకుతో 1 సారి, మొత్తం 7 పుటములు. అనుపానం పెరుగు మీద, మీగడ మీద, నెయ్యి, వెన్నపూస, నువ్వులనూనె మాత్రము వాడవలయును. నీసు మాంసములు వాడరాదు. పాలు, పెరుగు, మజ్జిగ, కందిపప్పు వగైరా. వాడవలయును. దీనికి తగ్గని ఏ జబ్బు లేదు. దానిమ్మకాయ రోజుకు ఒక్కొక్కటి తినవలయును.

లోహ భస్మం 10 గ్రా., శొంఠి చూర్ణం 20 గ్రా., శిలాజిత్తు 20 గ్రా., నేరెడు గింజల చూర్ణం 120 గ్రా., తిప్పసత్తు చూర్ణం 60 గ్రా., నేల వేము చూర్ణం 240 గ్రా., సున్నముఖి

చూర్ణం 10 గ్రా. మొత్తం 5.80 కే.జిల మందు తయారగును. రెండు పూటల మంచినీటితో వాడవలయును.

వసంతకుసుమాకరం 1 గ్రా. , మకరధ్వజం 2 గ్రా., శతపుటఅభ్రకం 3 గ్రా., గోక్సురాది గగ్గులు 85 టాబ్లెట్లు, శిలాజిత్తుపటి 20 మాత్రలు, వంగ భస్మం 10 గ్రా., సరివాదేవటి 20 మాత్రలు, సప్తమరతి లేహ్యం 40 మాత్రలు, బృహాతచందనాది చూర్ణం 40 గ్రా., లోకేశ్వరి రసం 10 గ్రా., కాశిస సింధూరం 10 గ్రా., పూర్ణచంద్రోదయం మాత్రలు 2.

ముధురుకు - వసంత కుసుమకరం, అభ్రక భస్మం, తిప్పసత్తు, సిలాజిత్తు, కొంత అభ్రక సింధూరం, లోహాభ్రక సింధూరం, వంగ భస్మం, తామ్రభస్మం, పూర్ణచంద్రోదయం, రౌప్య భస్మం, యోగంద్ర రసం, మోతిభస్మం, కాశికం, జాజి, జాపత్రి, యాలుకలు, లవంగాలు, పచ్చ కర్పూరం, కుంకుమ పువ్వు, జరిపోట్ (హిమలమ వారి)

సోరియాసిస్ కు - వేపనూనె 500 గ్రా., గంధకం 250 గ్రా., కొన్నొత్తులు 5, ముద్దకర్పూరం 250 గ్రా., సోమరాజ్ తైలం, జింకు ఆయింట్ మెంట్

పిలకలకు, మొలలకు - పలక రస కర్పూరం, కోపురస కర్పూరం, ఆముదముతో నూరి లేపనం

బ్లైడ్ కేన్సరు - నెర్విటాల్, వసంతకుసుమకరం, సిద్ధమకరవరణం, రేవ్యభస్మం, రస సింధూరం, యోగెంద్ర రసం, శీలాంకుశరసం, కర్పూర శిలాజిత్తు, గుడిసిసత్వం వైక్రాంత భస్మం, మోతిభస్మం, సధ్గుణసింధూరం, పూర్ణచంద్రోదయం, జాజి, జాపత్రి యాలుకులు, లవంగాలు, పచ్చకర్పూరం, కుంకుమ పువ్వు

సారా, బ్రాంది తాగుడు మానుటకు - శీతపల ఆకు పసరు టీ గ్లాసుడు నందు ఆవగిం వీరం చేర్చి పరగడుపున తాగించి 1 గంట వరకు ఏమి తినకూడదు.

కిడ్నిలో రాళ్ళు కరుగుటకు, కిడ్నీ చెడిపోయినవి బాగుచేయుటకు - శిలాజిత్తు రాం సూరేకారం సమభాగములుగా నూరి మూసలో పోసి నిప్పులపై పూదగా సున్నమగు 5 రోజులు మందును వాడి 5 రోజులు ఆగి మరల 5 రోజులు వాడవలయును. కొబ నీరు అనుపానము.

మిరియాలు, ఉమ్మెత్త గింజలు శుద్ధి చేసినవి. వీటిని సోపు కషాయంతో నూరి మాత్ర కట్టి అనుపానము. సోపు కషాయము.

సుఘరు మందు - నేలవేము, జీలకర్ర, నల్ల జీలకర్ర, వడపత్రి, సునాముఖి, సైంధవ లవణం, మెంతులు, మిరియాలు, నేరేడు గింజలు, నేలతంగేడు, లోహభస్మం 10 గ్రా., తిప్పసత్తు 10 గ్రా., శిలాజిత్తు 100 గ్రా. ఇవి 100 గ్రా. చొప్పున తీసుకొని వీటికి 25 గ్రా. శుద్ధి చేసిన ఉమ్మెత్త గింజలు శుద్ధి నిమ్మపులుసులో 3 రోజులు నానబెట్టి ఎండించవలయును.

లేపనశక్తికి - నీరసింహ లేహ్యం, వంగ భస్మం, శిలాజిత్తు, తిప్పసత్తు, కట్టిన ఇంగ్లీకం

త్రివగం భస్మంను పల్లేరు సమూల పసరుతో నూరి ఉడికించి మాత్రలుచేసి (కంద గింజంత) రెండు పూటలు నేరేడు చెక్క కషాయంతో.

బంగాళ దుంప రసం, చిలకడదుంప రసంలతో వీటితో 250 గ్రా. అన్నబేదిని నూరి బిళ్ళ చేసి ఆరించి 50 పిడకల పుటం. ఇలాగున 3 పుటాలు. దీనిని పై మందు వాడుతు 2 పూటలు తేనెతో వాడవలెను.

పక్షవాతమునకు - గానుగ వేరును మెత్తగా దంచి రసం తీసినది టీగ్లాసుడు, మేక పాలు టీ గ్లాసుడు కలిపి అందులో 8 మిరియపు గింజలు, 8 వెల్లుల్లి రేకలు కలిపి నూరి త్రాగించవలయును రెండు పూటలు. ఉప్పుడు బియ్యం అన్నం మాత్రమే తినవలయును. లేనిచో ఇడ్లీ రవ్వ, ఉప్పుడు రవ్వ జావగా కాచి త్రాగవలెను. ఈ చికిత్స నెలకు మూడు సార్లు చేయవలెను. 10 రోజులకు ఒక సారి చేయవలెను.

పై మర్దనకు మిరియాల చూర్ణం, నల్లమందు, నువ్వులనూనెలో కాచి మర్దన

హై బి.పి వుంటే - వెలిగారం 30 గ్రా., 20 గ్రా. పటిక, 20 గ్రా. సూరేకారం, 10 గ్రా. ఇంగ్లీకం వీటిని కలిపి నూరి తదుపరి 20 గ్రా. దనియాల పొడి, 20 గ్రా. జీలకర్ర చూర్ణం కలిపి ఉసిరికాయరసంతో నూరి మాత్రలు కట్టి 21 రోజులు రెండు పూటల మంచినీరుతో వాడవలయును.

మోకాలునొప్పులకు పట్టు - వెల్లుల్లి రేకలు 1 తులం, శొంఠి పొడి 1 తులం వీటిని బ్రాందితో నూరి నొప్పులు వున్నచోట పట్టు వేసి అరగంట తర్వాత కడిగివేయవలయును. నొప్పి తగ్గును.

కిడ్నిలో రాళ్ళు కరిగి నీరుడు సాఫీగా అగుటకు - 150 గ్రా. సూరేకారంను పల్లేరు వేరు ఆకు కాయలతో నూరి ప్రమిదలో పెట్టి శీలు చేసి 20 పిడకల పుటం. మంచినీరుతోను,

పాలతోను వాడవలయును. గుండె పోటుకు కూడ ఈ మందును నీటిలో కలిపి వాడవచ్చును.

బొల్లికి లోపలకు, పై పూతకు మందు - వేప పిక్కల మందు బావంచాలు, పసుపు, ఆవునెయ్యి ఇవి సమభాగాలు కలిపి నూరి ఉదయం, సాయంత్రం చెంచాడు చొప్పున మంచినీరుతో వేసుకొని మరల ఇదే మందు పైపూతకు రాయవలెను.

త్రిధార పాలతో నల్లగొర్రె వెంట్రుకలను నూరి పుతం. వెన్నతో వాడవలయును

కోమాలో వున్నవారిని లేపుటకు - తుమ్మి ఆకు పసరు సూర్యోదయంనకు ముందుగా ముక్కులో 5 చుక్కలు వేయవలెను. కోమా నుండి మెలుకవ వచ్చును.

రాతి మదం శుద్ధి ఆవు పంచితంలో నానబెట్టి ఎండించవలెను. తదుపరి పన్నీరులో నానబెట్టి ఎండించి కొంచెం పలుచగా వుండగానే సీసాలో భద్రపరుచుకొనవలయును.

వాత నొప్పులకు, పక్షవాతములకు - 30 గ్రా. సవ్వీరంను 5 బొండాల కొబ్బరి నీరులో 3 తులాల మిరియాలు కలిపి నూరి డోలాయంత్రమున వండవలయును. సవ్వీరం నీటిలో కరిగి పోవును. కొంచెం గుడ్డలో యుండును. రెండింటిని కలిపి నూరి మిరియాలు పొడితో సహా నూరి గసగసలాంత మాత్రలు చేసి వాడుకొనవలెను.

షుఘరు మందు - వెలిగార సున్నం 30 గ్రా., శుద్ధి గంధకం 30 గ్రా., శుద్ధి తాళకం 30 గ్రా., శుద్ధి మణిశిల 30 గ్రా. వీటిని కుంభకర్ణ ఆకు పసరుతో మర్ధించి ఆరించి సీసాలో పోసి ఇసుక మధ్యన సీసాను పెట్టి 18 గంటలు వంట. మొత్తం సింధూరమగును. గురువింద ఎత్తు మందు 3 భాగాలు చేసి 3 పూటలు వాడవలయును. తేనె అనుపానం

మణిశిల శుద్ధి - మేకపాలతో నూరి గోమూత్రం చురక
గంధకం శుద్ధి - చెరుక రసం, గుంటగలగర, బూడిద గుమ్మడి
తాళక శుద్ధి - నవాసారం, సూరేకారం నూరి దీని మధ్యన పెట్టి సున్నపు నీటిలో డోలాయంత్రం 3 గంటలు వంట

కంటిచూపుకు - మునగ విత్తులు 100 గ్రా. మిరియాలు 100 గ్రా. వీటిని బాగా నూరి కంటు పళ్లెంలో పెట్టి ఎండలో 4 రోజులు వుంచిన తైలం దిగును. పెసరు గింజంత కంటిలో పెట్టిన సమస్త జబ్బులు తగ్గును.

బట్టతలకు - గురివింద ఆకు 8 గ్రా., గుప్పిల్లు (తీగతోసహా) వసనాభి (30గ్రా.), లక్క 60 గ్రా., అతిమధురం 60 గ్రా., నువ్వుల నూనె పదిలం

సమస్త మోహరోగాలకు - సల్ఫ్యూరిక్ ద్రావకంను ఒక్కొక్క చుక్కను వేస్తూ పాదరసంను నూరిన రసము మైనం అగును. దీనిని అవగింజంత, బెల్లము మెత్తగా నూరిన దాని మధ్యలో పెట్టి వాడవలయును.

తలఎదుగటకు - ఉసిరి పప్పు 4 భా. కస్తూరి పసుపు 1 భాగం, వాము 1 భాగం, తెల్ల ఆవాలు 1 భాగం, గవ్వసలుకు సాంబ్రాణి 1 భాగం వీటని మెత్తగా నూరిన ఈ పొడి రెండు తులములు తీసుకొని ఆవు పాలలో మరిగించి తలకు రాసుకొని 1 గంట ఆగి శీకాయతో తలస్నానం చేయవలెను. సమస్త నేత్ర రోగాలు నశించి తల బాగుగ ఎదుగును.

పక్షవాతమునకు- 36 గ్రా. ఇంగ్లీకంను చనుబాలు లేకు ఆవుపాలలో 2 రోజులు ముంచి ఎండించి వెల్లుల్లి రేకలు వలిచినవి 150, ముద్ద హారతికర్పూరం 25 గ్రా., 5 గ్రా. సవీరం వీటని నూరి పై ఇంగ్లీకంనకు కవచమిచ్చి పై నిప్పులపై కాల్చి చల్లారిన తర్వాత ఇంగ్లీకంను తీసి ఇనుప మూకుడిలో 500గ్రా. గోదుమలు పోసి దీనిపై పై ఇంగ్లీకంను వుంచి మరల 500 గ్రా. గోదుమలు పోసి వంట చేసి తీసిన ఈ ఇంగ్లీకంనకు ఒక శేరు కుప్పింటాకు పసరు చుదికించి నూరుకొని పూసెత్తుమందు అనుపానం. మిరియాలు, శొంఠి, పిప్పల్లు వీటిలో దేనినైన కషాయంతో నీసు, పులుపు, దుంపలు నిషిద్ధం

పగటిపూట నక్షత్రాలు కనబడుట - శుద్ధి మణిశిల, పచ్చకర్పూరం, పిప్పల్లు, గానుగ గింజలు వీటిని నీటితో కళ్ళకు కాటుక పెట్టుకొంటే పగటిపూట నక్షత్రాలు కనబడును.

స్త్రీ జారణ అగుట - 40 గ్రా. పాదరసం, 50 గ్రా. తగరం, వెలిగారం 20 గ్రా. వీటిని ఎర్రఆకు పసరుతో నూరి మర్ధించి గోలీ చేసి అంగమునకు రాసుకొని సంబోగించిన ఆయుష్షు వున్నంత వరకు స్త్రీ జారణ అగును.

వెంట్రుకలు నలుప అగుటకు - గోరింటాకు, సాంబ్రాణి, మామిడిజీడి, కామంచి వీటిని నువ్వులనూనెతో వండి 30 రోజులు భూమిలో పాతిపెట్టి తలకు వాడవలెను. రాత్రిపూట, ఉదయం తలకు స్నానం చేయవలెను.

కుష్టులకు - తాటిబెల్లం, మర్రిపాలతో నూరి శనగ గింజ ప్రమాణం రెండు పూటలు

అంగ స్థంభనకు - జాజికాయపొడి 1 భాగం, తేనె 1 భాగం ఉడికించి కందగింజంత మాత్ర. కోడిగుడ్డు ఉడికించినది అనుపానముగా తినవలెను.

మధురుకు - మేడి పళ్ళ చూర్ణం, గులాబిరేకుల చూర్ణం, తాటి బెల్లం, నెయ్యి ఇవి సమభాగాలు కలిపి కొత్తపిడతలో పోసి ఇవి మునిగేటట్లు నిమ్మపులుసు పోసి కుండకు గట్టి శీలు ఇచ్చి 30 రోజులు వుంచిన తర్వాత తీసుకొని 2 పూటల వుసిరికాయంత.

సమస్త జబ్బులకు - సమస్త జబ్బులకు గాడిదగడప పసరున శంఖంను గాని, గౌరిని గాని నూరి బిళ్ళ చేసి ఆరించి అదే పిప్పిలో పెట్టి పుటం. అనుపానం నెయ్యి, వెన్నపూస

సంతానం కలుగుటకు - వావిలి చిగుళ్ళు, మిరియాలు, వెల్లుల్లి, నువ్వులనూనెతో నూరి ఉసిరికాయంత స్నానమైన తరువాత 3 రోజులు తినేది సప్పిడి పత్యం

సహదేవి, యష్టిమదుకం, పెన్నేరు, ఆరిచెక్క సమం చూర్ణించి ఆవుపాలు పంచదారలు కలిపి లేహముగా చేసి బహిష్టు సమయంలో 5 రోజులు తిని చప్పిడి పత్యం

లూటీలకు మందు - నల్ల ఉమ్మెత్త కాయను నిమ్మ పులుసుతో మర్ధించిన కాయ ఒక్కటి నల్లజీలకర్ర 1 తులం, ముద్ద కర్పూరం 1 తులం, జింకు పౌడర్ 1 తులం వీటిని కొబ్బరినూనెతో మర్దించి పై పూతకు వాడవలెను.

508.రసమైనం - 18 గ్రాముల శంఖు పాషణం, 18 గ్రా. తాళకం, 18 గ్రా. ఇంగ్లీకం, కలబంద గుజ్జుతో నూరి 3 తులాల వెండిబిళ్ళకు కవచమిచ్చి ప్రమిదలో పెట్టి శీలు ఇచ్చి 15 పిడకల పుటం. ఈ మొత్తం కళంకు అగును. ఈ కళంకం వజ్రమూసలో వేసి దానిలో పాదరసం 300 గ్రా. పోసి దానిపై వేరొక మూస పెట్టి ఈ రెండు మూసల మధ్య శీలు బందనం చేసి పై మూసలో నీరు పోసుకొంటు రెండు గంటలు వంట చేయాలి. తరువాత దించి ఒక గుడ్డలో పోసి పిండిన రస మైనం వచ్చును. ఈ మైనం కట్టిన ఉప్పు, వెలిగారంలో పెట్టి చిన్న పుటం. రసం అగ్నిజయమగును.

అగ్నిజయమైన రసం 10 గ్రా., 5 గ్రా. గంధకం, 5 గ్రా. నవాక్షరం యోగామృతంతో నూరి బిళ్ళ కట్టి ఎండించి శీలు చేసి 5 పిడకల పుటం. మొత్తం సింధూరమగును. వెండి మీద ఏత

509.తామ్రం కలుపుడు - 100 గ్రా. తామ్రంను 150 గ్రా. నైట్రిక్ ఆసిడ్ లో వేసిన తామ్రం నైట్రిక్ ఆసిడ్ లో కలిసిపోవును. ఆ కలిసిపోయిన ఆసిడ్ లో 100 గ్రా. హైపో క్రిస్టల్స్ వేసిన మొత్తం కలిసిపోవును. రెండు రోజులు పుల్లతో తిప్పుచూ 3వరోజు

తామ్రం. పాత్ర అడుగు భాగంనకు చేరును. ఆ చేరిన తామ్రం 1.5 గ్రా. బీజం 1 గ్రా. కలిపిన మొత్తం మేలిమి అగును.

510.మహాయోగం - పునీరు 1 తులం, కాకిచిప్పలు 1 తులం, సర్వీరం 1 తులం వీటిని మెత్తగా నూరి అరటి దొప్పలలో పెట్టి జయనీరు తీసుకొనవలయును. ఈ జయనీరుతో తుత్తమును ముంచి ఎండించి ప్రమిదలో వుంచి 30 పిడకల పుటం. సున్నమగును. ఈ సున్నం తగరంలో నీళ్ళు లాగును. వెండిపై పసిమి అగును.

511.పటిక - శేరు ఆవుపాలలో అరకేజి పటికను ఇగర వండి తెల్లజిల్లేడు పాలతో నూరి బిళ్ళ కట్టి వెలగకాయంత ఆకు పెలుసు ఆకు ముద్దలో పెట్టి పుటం పటిక కట్టును. కట్టిన పటిక 2 భాగములు త్రిధార పాలతో నూరి 1 భాగం గంధకంనకు కవచమిచ్చి 2 పిడకల పుటం. గంధకం కట్టును.

నోట్-స్వర్ణమాక్షికమును ఇనుప మూకుడిలో సైంధవ లవణం వేసి ఎర్రగా కాల్చి నిమ్మపులుసులో ముంచుతూ కాల్చిన భస్మం అగును.

512.సీస సింధూరం, సీస సున్నం - సూరేకారం 200 గ్రా. గుల్ల సున్నం 200 గ్రా., గోమూత్రంలో నూరి 50 గ్రా. సీసం బిళ్ళకు కవచమిచ్చి ప్రమిదలో యుంచి 100 పిడకల పుటం సింధూరమగును. గుల్ల సున్నంకు బదులు రాతి సున్నం అయితే సీసం సున్నం అగును.

513.తామ్రభస్మం - 3 గ్రా. శంఖం పింగాణి గిన్నెలో పల్చని గుడ్డలో శంఖం పెట్టి తెల్లజిల్లేడు పాలతో తడిపి ఒక రోజు యుంచి అదే పాలతో నూరి శుద్ధి చేసిన రాగి ఒక తులం బిళ్ళకు కవచమిచ్చి ప్రమిదలో యుంచి శీలు చేసి 100 పిడకల పుటం. తెల్లగా భస్మం అగును.

514.పాదరసం గట్టిపడుట - గంధక సున్నం 20 గ్రా., నవాసారం 20 గ్రా., హారతి కర్పూరం 25 గ్రా., మొత్తం మెత్తగా నూరి మంచులో పెట్టిన జయనీరు వచ్చును. ఒక తులం పాదరసం వేడిచేసి ఒక చుక్క వేయగా గట్టిపడును.

515.ఆసిడ్ ప్రూఫ్ రాగి - వంటల సూరేకారం, ఇంగ్లీకం, పాదరసం, మణిశిల ఇవి 3 గ్రా. చొప్పున తీసుకొని నిమ్మపులుసు తో నూరి నాటుగుడ్డు తెల్లసొనతో నూరి 12 గ్రా. వెండికి 2 గ్రా. రాగి చేర్చి కరిగి బిళ్ళ చేసి పై మందు కవచమిచ్చి ఆరించి ప్రమిదలో పెట్టి 12 పిడకల పుటం. కళంకు అగును. దీనికి ఆసిడ్ ప్రూఫ్ రాగి లేక ఆసిడ్ ప్రూఫ్ మట్టి తీసుకొనవలయును.

516.వెండియోగం - 1 తులం రాగి, వెండి పావు తులం, సత్తు 2 గ్రా.. రాగి, వెండి నీరులాగ కరిగి సత్తువేసి కరిగి సహదేవి పసరు కొంచెం కొంచెం వేసి వెంటనే తినే ఉప్పు వేసి కలిపి పేడలో పోయగ వెండి అగును.

517.ఇంగ్లీకం కట్టు - గంధకం 3 గ్రా., సవ్వీరం 3 గ్రా., శంఖం 3 గ్రా. తుత్తం 6 గ్రా. వీటిని వెల్లుల్లితోనూరి ఈ ముద్ద మధ్యన ఇంగ్లీకం పెట్టి పుటం

నోట్ -శంఖం, వెలిగారం, ఇంగ్లీకం, పాదరసం వీటిని 5 గ్రా. నువ్వుల నూనె, 5 గ్రా. తెల్లజిల్లేడు పాలతో నూరి గుడ్డుగులకలో పెట్టి వేరొక గులక మూసి 3 గుడ్డ శీలులు చేసి ఆరించి కుక్కుట పుటం.రాగి 10 గ్రా. ఒక గ్రా. మందు వేయవలయును. వెండి 8 గ్రా. ఒక గ్రా. మందు వేయవలయును.

518.తాళకం కట్టు - అభ్రకం నల్లది, సూరేకారం సమభాగాలు జిల్లేడు పాలతో నూరి పుటం. సున్నమగును. దీనిని తెల్లజిల్లేడుపాలతో నూరి తాళకంనకు కవచం ఇచ్చి పుటం. తాళకం కట్టి సింధూరమగును.

నోట్ -250 గ్రా. పాదరసంను కల్వంలో వేసి పసుపు, ఇటుక పోడి శుద్ధిచేసిన తర్వాత హెచ్. సి. యల్ ఆసిడ్ లో నెమ్మదిగా వుడికించిన శుద్ధి అగును.

519.ఇంగ్లీక మైనం - తురుసున్నం కలబంద గుజ్జులో వేసి ఇంగ్లీకంనకు చురికించిన మైనం అగును. (12 గంటలు)

520.వీరజయనీరు - సూరేకారం 100 గ్రా., సవ్వీరం 100 గ్రా., నల్లికాయ గంధకం 100గ్రా., ముత్యపుచిప్పల సున్నం 100 గ్రా., తాళకం 100 గ్రా., వున్నీరు సున్నం 50 గ్రా. వీటిని కుండలో పోసి 24 లీ. నీరు పోసి తగిన వేరొక కుండ బోర్లించి శీలు ఇచ్చి 12 గంటల వంట. దీనిని జాగ్రత్త చేసి 64 పాషణములు ముంచి ఆరించుచూ వచ్చి కట్టి సున్నమగులగును.

521.నాగ సింధూరం - వంగం, రసం, నాగం వీటిని ద్వందించిన వెంటనే తాళకం వేసి నూరి తాటి కల్లులో 12 గంటలు, గుంటగలగర ఆకు రసంలో 12 గంటలు నూరి బిళ్ళ చేసి ఆరించి ప్రమిదలో శీలు చేసి 10 పిడకల పుటం. షుగరుకు మందు. వాదంనకు వెండిపై, రాగిపై

నోట్ - చాకలిసోడాలో వీరం కట్టినది సింధూరమైనది. ఈ సింధూరం మూసలో పెట్టి పైన తుత్తం పెట్టి వేడిచేస్తే కరిగి కట్టును.

522.జయనీరు - రసం, వంగం, సవ్వీరం, వెలిగారం, సూరేకారం, ముద్దహారతి కర్పూరం, మైలుతుత్తం వీటిని జయనీరు తీసుకొనవలెను. ఆకరున పిప్పి మిగిలిన దానికి నవాసారం చేర్చిన జయనీరు వచ్చును.

523.రాగి, వెండి, సతు భస్మం - రసం, వంగం, సూరేకారం, వెలిగారం నిమ్మరసంన నూరి ఎండించిప్రమిదలో శీలు ఇచ్చి ఆరించి 10 పిడకల పుతం భస్మమగును. ఈ భస్మం మధ్యన రాగి, వెండి, సత్తు మొ. భస్మంలు అగును.

524.తగరం భస్మం - సూరేకారం, వెలిగారం, తాళకం వీటిని నూరి వంగమునకు కవచమిచ్చి పుతం. తగరం భస్మం అగును.

525.గంధకం(శతవేద) - గంధకంను 3 తులములు ఒక పిడతలో సగం వరకు కలబంద గుజ్జును పోసి సన్నని సెగపై 12 గంటలు వంట చేయవలెను. ఇట్లు నాలుగు సార్లు చేయవలయును. ఇది శతవేద బహు జాగ్రత్త. ఈ గంధకంను పెంకులో పెట్టి 12 గంటలు జిల్లేడు ఆకు పసరు చురక. రాగిమీద, వెండిపై వేద అగును.

526.గార్లిక్ లిక్విడ్ - నిమ్మకాయంత సైజు ఎర్రగోధముల అర వీటి మధ్యన మట్టిదాకలో పెట్టి నిప్పులపై పెట్టి దోరగవండి చల్లారిన తరువాత తీసుకొనవలెను. దీనికి లవంగ యాలకులు, పచ్చ కర్పూరం, జాజి, జాపత్రి, నల్లమందు తేనెతో నూరి

527.తాళక సింధూరం - పటిక, ఉప్పు నిమ్మరసంతో నూరి తాళకంనకు కవచమిచ్చి 5 పిడకలతో పుటం. సింధూరం

528.వెండి యోగం - శంఖంను నిమ్మపులుసుతో నూరి బిళ్ళ కట్టి ఆరించి ఉప్పు మధ్యన పెట్టిశీలు చేసి నాలుగు పిడకల పుతం. రాగి 10 గ్రా. కరిగి పూసెత్తు

529.తుత్త భస్మం - 50 గ్రా. తుత్తం ముక్కను మునిగే విధంగా జెముడు పాలు పోసి 10 రోజులు వుంచిన తర్వాత 5 గ్రా. పాదరసం చేర్చి అదే పాలతో నూరి వుండ చేసి దళసరి గుడ్డను మూటను కట్టి పిడతలో పెట్టి అది మునిగేలాగున పాలు పోసి శీలు చేసి 50 పిడకల పుతం. భస్మమగును. రాగిపై వాడేది.